## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016452

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ గురునాథాయ నమః

# హరిశతకము.

భమిడిమఱ్ఱి వేంకట సుబ్బరాయశాస్త్రులుగారి

తృతీయపుత్త్రుఁడు

భమిడిమఱ్ఱి రామచంద్రమూర్తి ప్రణీతము.

బోర్డుస్కూలు హెడ్మాష్టరు, తిమ్మాపురము,

అన్నవరముపోష్టు, తునిడివిజన్.

మొదటికూర్పు 1000 ప్రతులు.

పిఠాపురము

శ్రీ విద్వజ్జన మనోరంజని ముద్రాక్షరశాల

1937.

 [వెల రు 0-1-0.

# పీ ఠి క.

---

పాఠకమహాశయులారా !

ఈ శతకమును నాపుత్త్రిక చంద్రాభట్ల అచ్యుతాంబ ప్రోత్సాహమువలన (స్వస్తిశ్రీ యువనామసంవత్సర పుష్య శు ౧3 సోమవారము) 26-1-1936 సం॥రం తేదీ మొదలు ది 18-2-36 సం॥రము తేదీనాటికి వేనువరము బోర్డుస్కూలు మాస్టరుగానుండి వ్రాసితిని. ఇప్పటికి సుమారు ఒకసంవత్సరము అయినప్పటికిని యీ తిమ్మాపురముగ్రామములో స్కూలుపనులు అధికముగా నుండుటవలన అచ్చొత్తించుటకు ఆలస్యమైనది. కాని భగవంతుని కృపవలన నీనాటికి అచ్చొత్తింపఁగలిగితిని. ఇందుల దోషములున్నయెడలఁ జదువరులు తెలియఁబఱచినచో సవరించుకొందును. నాకిదియే ప్రథమప్రయత్నముగుటచేఁ దప్పులున్నను యొప్పులమాత్రమే గ్రహింపఁగోరెదను. ఈగ్రంథమునకు సహాయమొనర్చినవారలకు నాకృతజ్ఞత తెలుపుచున్నాను.

ఇట్లు విద్వజ్జనవిధేయుఁడు,

భమిడిమర్రి రామచంద్రమూర్తి.

శ్రీ గురుభ్యో నమః.

# హరిశతకము



ఉ. శ్రీధరు సత్యసాధనుని ♦ శ్రీకరుఁడౌ పురుషోత్తమున్ బ్రభున్
మాధవు నాద్యు నచ్యుతు న ♦ మాపతిపూజితు వాసుదేవునిన్
సాధుజనావనున్ మహిత ♦ సత్యపరాక్రము పేరు విష్ణు నం
భోధిశయాను నిన్ ఘను న ♦ మోఘుని వేఁడెదఁ గావుమో హరీ!

ఉ. శ్రీధవ! వాగ్ధవాదిసుర ♦ సేవిత దివ్యపదారవింద! యో
భూధవ! దేవవంద్య! గుణ ♦ భూషణభూషిత! దివ్యమూర్తి యో
గాధితనూజయాగఫల ♦ కారక! సర్వనిలింపరక్షకా!
నాథుఁడ వీవె నన్ గృప స ♦ నారతమున్ దయఁ బ్రోవ వో హరీ!

చ. ఎవనిని శేషసద్గుణము ♦ లెంచుచు విఘ్నములెల్లఁ బాయఁగాఁ
దవిలి భజింతు రెల్లరును ♦ దద్దయు భక్తి నభీష్టసిద్ధి కా
భవసుతుఁ డౌ గణేశు మదిఁ ♦ బ్రార్థనఁ జేసెద నిష్టసిద్ధికై
కపిత మనఃప్రమోద మిడఁ ♦ గాఁ బదగుంభన మబ్బ నో హరీ!

చ. భువనములన్ సృజించునను ♦ భూతిఁ బితామహుఁడౌ దువంచునా
ర్జనమునఁ బెంప విష్ణుఁడని ♦ సర్వము నాశ మొనర్చి వేయఁగా
శివుఁడ వటంచు నెంచెదరు ♦ విస్మయరూప! విచిత్రమయ్యె నీ
మువ్వురును నొక్కటేగద వి ♦ మూఢమనస్కత వీడినన్ హరీ!

# హ రి శ త క ము

ఉ. శంకరు నర్ధదేహ మయి ♦ శక్తివిజృంభణ ముల్లసిల్లఁ దే
జోంకతనూవిలాసభయ ♦ దాగ్భటి రాక్షసులన్ వధించి క్షే
మంకరలీల భక్తజన ♦ మండలి నెల్లను బ్రోచినట్టి యా
శాంకరి నిష్టసిద్ధి కని ♦ శంబు నుతించెదనయ్య శ్రీహరీ! ౫

చ. జగముల నెల్ల నీ సుకర ♦ సంపదచేఁ ద్రిగుణాప్తిచే లస
త్షిగవిలసన్మహామహిమ ♦ కాంతులచే మును పద్మినీహితం
బుగ వసుమద్దళంబులను ♦ బూనఁగఁ జేయుచుఁ గర్మసాక్షివై
యగణితవేదరూప మగు ♦ నట్టి నినున్ భజియింతు శ్రీహరీ!

ఉ. అంతరవర్తియున్ శివుఁడ ♦ నార్తిహరుండ నటంచు నెమ్మదిన్
శాంతుఁడవంచు వేద్యుఁడవు ♦ శర్వుఁడవున్ బరమాత్మవంచు శు
ద్ధాంతుఁడ వంచు నీశుఁడవ ♦ నౌదువుగా సకలాంతరంగముల్
గాంతు నటంచు నెన్నుదు ర ♦ ఖండపరాక్రమ! నిన్ను శ్రీహరీ!

ఉ. దండము, పుండరీకదళ ♦ దర్ప విరాజితనేత్రశోభితా!
దండము, శంఖచక్రధర! ♦ తాపస మానస పద్మసంస్థితా!
దండము, కంసగర్వహర! ♦ ధర్మవిచక్షణా! పాప శిక్షణా!
దండము, నీలకంఠనుత ♦ ధన్యచరిత్ర! రమేశ! యోహరీ! ౮

ఉ. శ్రీపతి! నిన్ను నేఁ గొలువఁ ♦ జెంతకు రా వది యేటిధర్మమో?
కోప మదేమి నావయిని ♦ గోర్కెలతోఁ జెడిపోతి నందువా?
తాపసు లెంతో యాశగొని ♦ తద్దయు నిన్భజియించినంతనే
చాపలతావిమోచనము ♦ సల్పవె వారికి నెల్ల శ్రీహరీ! ౯

చ. మమతఁగలాఁడ నోదనుజ♦మర్దన! నీవె శరణ్య మంచు నీ
మమున భజించుచుంటి నను♦మానము లెల్లను బాపి కావవే
నముఁ డిఁక లేఁడు నీ కెచట ♦ సాధుల రక్షణసేయ నిద్ధరన్
కమలదళేక్షణా! వరద!♦ కారుణికోత్తమ! ప్రోవు శ్రీహరీ!

చ. కమలదళాక్ష! దాశరథి! ♦ కామితసత్ఫలదా! రమాధవా!
నమదజయాంచితప్రకట♦చాపధరా! నిగమాంతవేద్య! గౌ
తమవనితార్తిసంహరణ ♦ ధర్మవిచక్షణా! సాధురక్షణా!
సుమహితకార్యదక్షిణ! వ♦సుప్రభవేక్షణ! జాణ! శ్రీహరీ!

చ. అవనిజ నీకు భార్యయని♦యా ముద మొప్పఁగ నేలికొంటి వీ
వవనిజయార్తి నున్ననను ♦ నర్మిలిఁ బ్రోవఁగరాదె నే పున
ర్భవములనొందకుండ భవ♦బంధము లెల్లను ద్రోచి కావఁగా
నెవరిని వేఁడుకొందు మది ♦ సిద్ధచరిత్ర! పవిత్ర! శ్రీహరీ!

ఉ. ప్రాసము తప్పగున్ గణము ♦ భంగమగున్ యతినిష్ఠపోవునం
త్రాసముఁజెందు జ్ఞానము వి♦దగ్ధమతిన్ నినుఁగాక యన్యులన్
గ్రాసముకోసమై పొగడఁ ♦ గావున నిన్ను నుతించుపద్యముల్
దోసముఁ జెందనీక పద♦తుష్టియుఁ బుష్టియుఁ గూర్చు శ్రీహరీ!

ఉ. శ్రీరఘురామ! నిన్ బొగడి♦చిత్తము రంజిల రామచంద్రుఁ డెం
తో రసగుంభనల్ వెలయ ♦ ధుర్యతఁ జెప్పె ననేకపద్యముల్
మారగురూ! యవన్నియును ♦ మంచివగున్ భవదీయసత్కృపా
సారము గల్గెనేని యిఁక ♦ సందియమేల! వచింప శ్రీహరీ!

ఉ. శ్రీసతినాథ! నిన్మదిని ♦ సేవయొనర్చి రసానుకూలతన్
వ్రాసినయట్టిపద్యములు ♦ భావములోపల నిల్పి ధారుణిన్
భాసిలఁజేయవే కృపను ♦ భాస్కరునంశువులట్టు లీభువిన్
దానజనార్తి భంజన! హి♦తవ్రజ రంజన! యోయి శ్రీహరీ!

ఉ. మాపునురేపు నీస్మరణ ♦ మానక చేయుదుఁ బద్యపాళిచేఁ
దాపసహృన్నివాస! విశ♦దంబుగ నుత్పలచంపకంబులన్
దాపినదండలన్ మెడను♦దాల్ప నొసంగెద భక్తి నెంతయున్
జూపవె నీకృపారసముఁ ♦ జూపక వీడను నిన్ను శ్రీహరీ!

ఉ. భానుఁడు శక్తియున్ మఱియుఁ ♦ బన్నగశాయియు విఘ్న
నాథుఁడున్। మానిజన ప్రమోది యగు ♦ మంగళదాయి హి
మాంశుమౌళియున్। గానఁగ నందఱీవెగద? ♦ కంజదళేక్షణా!
భక్తిలేక నిన్। బూనిక మంత్రతంత్రములఁ ♦ బొందరు బుద్ధి
చలింప నోహరీ!

ఉ. కాయ మనోగతిన్ వెలయుఁ♦గాదె నినున్ రవియన్న భావనన్
బాయవు భాగ్యసంపదలు♦పార్వతి వీవె యటంచు నెన్నఁగన్
డాయవు పాపసంఘము లు♦దారుఁడు సాంబుఁడవీవటంచనన్
మాయము గావె విఘ్నములు♦మా స్తుతుఁ గా నిను వేఁడ శ్రీహరీ!

ఉ. వ్రాయఁగఁ బూనుటే తెగువ!♦భావమునందున నూహపుట్టఁగా
డాయదు నామనం బధిక ♦ ధైర్యమునం దరియింపకుంట చేఁ
దోయజగర్భుఁ డా నిగమ♦తోయములందున నీ విలాసముల్
వ్రాయఁగలేదె! నే నటుల♦వ్రాయఁగ నెంతటివాఁడ శ్రీహరీ!

చ. కవనముసేయనేర్చి భువిఁ ♦ గంజదళాక్షునిమీఁదఁ బద్యముల్
లవము లిఖింపనేరక ఫ♦లంబును గోరిన లాభ మబ్బునే?
నవనవబోధనావిలస♦నంబుగ నేర్చిన శస్త్ర విద్యచే
నవతి శర ద్వయస్క యగు♦నాఁతిని గొట్టినయట్లు శ్రీహరీ!

ఉ. శోధనచేత నెంతయు వి♦శుద్ధమనఃపరిపాకభక్తిచే
బోధనచేత నిన్నెఱుఁగఁ ♦ బోలునుగాక మఱొక్క రీతిగా
సాధన లెన్ని చేసినను ♦ సాధ్యముగాదు ఫలంబు సత్కృపన్
వేధ విధించుఁగాక మఱి ♦ వేఱుగతిన్ లభియించునే హరీ!

చ. ప్రభ గలవాఁడ వీవు భవ♦బంధయుతుండ నరుండ నేను నా
విభవమశాశ్వతంబనుచు ♦ వేమఱు వీఁగుచునుందు మూర్ఖతన్
బ్రభువర! సత్కృపాకలనఁ ♦ బాలనసేయఁగ నీకె భారమా
నభవముఖామరప్రచరి♦తాఖిలవేదివి నీవ శ్రీహరీ!

ఉ. పావన మైనయజ్ఞ మున ♦ వచ్చెఁడు పంక్తిరథుం డొసర్చఁగాఁ
దావక మైన లీల విశ♦దంబుగ నాతని కాత్మజుండ వై
కావవె గాధినందను మ♦ఖం బసురాళిని ద్రుంచి యాఁత స్త్రీ
భావ మహల్య చెందఁ బద♦పద్మరజం బొలికింపవే హరీ!

ఉ. తాపసుఁ డెంతజాణ! యవ♦తారము లెత్తినదేవదేవుఁ డీ
వే పరమాత్మ వంచెఱిఁగి ♦ యెల్లమహాత్ముల నీ వొకండవే
రూపఱఁ జేయఁగల్గు దని ♦ రూఢిగ నేర్చెనువిద్యలన్నియున్
జాపపరిక్రమక్రమత ♦ సల్పుదు మోద మెలర్ప శ్రీహరీ!

ఉ. బాలుఁడవయ్యు ఘోరతర♦పాతకిఁ దాటకఁ జంపి యజ్ఞమున్
బాలనఁ జేసి గర్వితు సు♦బాహు వధించి తమోనిబద్ధతన్
గూలినజాతి నాఁతిగతిఁ ♦ గోమలతన్ వెలయంగఁ జేసితో
మేలు! భళీ! యనన్ శివుని♦ మేదురచాపముఁ ద్రుంచితో హరీ!

ఉ. శ్రీరఘురామలక్ష్మణులు ♦ సీతయుఁ గూడి వనంబు సేరఁగాఁ
గోరుచు రాజ్యమున్ భరతుఁ♦ గూర్చఁగఁ గేకయరాజపుత్త్రి యా
భూరమణున్ వరం బడిగె ♦ భూరిసమస్త చరాచరాత్మకం
డారయ నీ వటం చెఱుఁగ♦ దయ్యయొ! మూఢతఁ జెందె శ్రీహరీ!

చ. ధనువును జేతఁ బట్టి భుజ♦దర్ప మెలర్పఁగఁ గానలందునన్
దనుజులఁ జంప నిచ్చమెయిఁ♦ దప్పులఁ గేకయరాజపుత్త్రిపైఁ
గనఁబడ నట్లొనర్చి సుర♦ఘాతుకులన్ వధియించినాఁడవో
దనుజవిదారి! నీమహిమఁ ♦ దథ్యముగా నెవఁ డెర్గు శ్రీహరీ.

ఉ. ఓడక సీతఁ గాచుకొని ♦ యుండుము నే నటు లేఁగి లేఁడినిన్
దాడనఁ జేసి పట్టుకొని ♦ దగ్గఱ వచ్చెద నంచు లక్ష్మణున్
దోడుగ నుంచియున్ జనుట♦తోయజనాభ! పులస్త్యసూనుని
దాడనఁ జేయు కారణము ♦ తద్దయు గల్గుట కే కదా హరీ. ౧౮

చ. మృగమును వెంటనంటియును ♦ మేటికరంబున విల్లుబూనియా
శుగముఁ దొడంగి యేయఁగడు♦ చోద్యముగా నదిరక్త సుండుగాఁ
దెగిపడి పోయి భూమిపయిఁ ♦ ద్రెళ్లుచు నక్కట! లక్ష్మణా యటం
చుఁ గడుఁ గడింది పీనుఁగయి♦ సోలఁగ నేసితిగాదె శ్రీహరీ. ౧౯

# హ రి శ త క ము

ఉ. సీతయు లక్ష్మణా యనుచుఁ జేల్పడి రాఘవుఁడార్తనాదమున్
క్షితిలి చేయుచుండె నని బెద్దయు దుఃఖమునొంది లక్ష్మణా!
కాతరులైన రక్కసుల కార్యములేమి యొనర్చిరో కదా
భ్రాంతిని సాయమున్న నపఁ బర్గునఁ బొమ్మనె సీత శ్రీహరీ.

చ వదినను మాతగాఁ దలఁచు వాఁడగు లక్ష్మణుఁ డమ్మ! జానకీ!
కదనమునం బరాజయము గల్గదొకప్పుడు రాఘవుండనన్
త్రిదశులఁ గావఁ బుట్టిన త్రిదేహుఁడు దేవుఁడుగాని వేఱుగాఁ
దిది యెదనమ్ముమమ్మ! యని యెంతయుఁ జెప్పఁగ నమ్మదో హరీ.

ఉ ఓరిమ నాత్మ! లక్ష్మణ! యయో రఘురాముఁడు వచ్చినంతనే
ఘోరత నన్ను నాఁచికొనఁ గోరితి వోర యటంచు నిష్ఠురో
ద్గారిపచోశుగంబుల విదల్చిన లక్ష్మణుఁ డార్తిఁ జెంది తా
నా రఘురాముఁ డున్న యెడ కర్గెనుగా విధిలేక శ్రీహరీ.

చ. కినుకను మాయలేఁడి నటు గీటడఁగించి సురారిఁ ద్రుంచి పి
ల్చినఁ దనపర్ణశాలకును రాముఁడు వచ్చుచు దారిలోన ల
క్ష్మణు నటఁ గాంచి యొంటరిగ జానకినిన్ విడనాఁడి వచ్చితే
యనుచు వచించెఁ గాదె యది యంతయు నీచరితంబె శ్రీహరీ.

చ. అనుజునితోడ నే నిచట నాఁగక దానవుఁ జంపి వచ్చుచుం
టినిగద! యంతలోననె విదేహతనూజను విడిరాఁగ నీ
కను దగునయ్య! రక్కసులు కూళలు సీతకు నేమిమూఁడెనో
యనుచును నార్తితోఁ బలికి నట్టి మహాత్ముఁడ వీవె శ్రీహరీ.

ఉ. మానవజన్మమెత్తి బహు♦మన్ననలందిన రాముఁ డీతఁడే
కానల కేఁగి సీతకయి ♦ కష్టము లొందినరీతి నుండెనే
గాని స్వకీయభావమునఁ ♦ గల్గదొకప్పుడు మోహ మీతనిన్
దానవనాశనార్థ మవ♦తారమునన్ ఖిలసిల్లుదో హరీ. ౩౭

చ. దశరథరాజపుత్త్ర! నిను♦దార్కొన నొల్లక యుద్ధమందునన్
విశదముగాఁగ రాక్షసుల ♦ వేమఱుఁ జంపితివఁ చెలంగియున్
నిశలుఁ బవళ్లు నేమఱక ♦ నీ వటు సీతను గాచుచుండఁగన్
దశముఖుఁ డంత వచ్చె ముని♦తానయిమాయలమారి, శ్రీహరీ.

ఉ. రావణుఁ డట్టివచ్చి తన♦రక్కసి మాయను సీతనట్టె కొం
పోవఁగమార్గమధ్యమునఁ ♦ బుణ్యగుణుండుజటాయువెంతయో
రావణుతోన్ బెనంగియును ♦ రాక్షసనాథునిచేతఁ గూలియున్
ధీవరుఁ డాయుదంతమును ♦ దెల్పెఁగదా నినుఁ గాంచి శ్రీహరీ.

చ. విపినములోనఁ దమ్మునితో♦వీరుఁడు రాముఁడనన్ జరించుచున్
గపటపుదుఃఖ మొందుచును♦గాల్నడకన్ జనిసూర్యపుత్త్రునిన్
గపివరు నాంజనేయుఁ గని ♦ గట్టిగ స్నేహ మొనర్చి వాలినిన్
గపటతతోఁ వధించె నను♦గాథ లవన్నియు నీవె శ్రీహరీ. ౩౮

ఉ. వాలిని జంపి సూర్యజుని ♦ వానరరాజుగఁ జేసి వర్షపుం
గాలము దీఱ సీతఁ వెదు♦కంగ సమస్తదిశాతలంబులన్
వాలి కపుల్ గనుంగొనుచు ♦ వచ్చిరి జానకియున్న జాడలే
మూలనుగాంచలేదనుచు♦మూల్గుచుముక్కుచునంతశ్రీహరీ.

ఉ. నేరము లెన్ని చేసినను ♦ నీ పని యెల్లను సైఁచి ప్రోతు విం
పారఁగ నార్తినిన్ సరిగ ♦ నంచితలీల నొసర్చినట్టులే
శ్రీరఘురామ! భక్తు లని ♦ చేరిన యాగుహానినిన్ జటాయువున్
మారుతపుత్త్రు నా శబరి ♦ మాన్యులఁ జేసినరీతి నోహరీ. ౧౦

ఉ. సీతను జూడ నేఁగుమని ♦ చెప్పఁగ నా హనుమంతుఁ డంతటన్
గోఁతులతో సముద్రమును ♦ గొప్పగ దాఁటెదఁ జూచివచ్చెదన్
భీతిని మానియుండుఁ డని ♦ వేగమె దాఁటఁగ నద్రి నెక్కి తాఁ
గౌతుక మొప్ప గంతు లిడెఁ ♦ గాంతను జూచెద నంచు శ్రీహరీ.

చ. సురసను గెల్చి పర్వతము ♦ సోఁకియు సింహికఁ జంపి వార్ధి నిం
పరయఁగ దాఁటి లంకదరి ♦ నద్రిసమీపముఁ జేరి రాత్రివే
ళ రహిని సీతఁ గన్గొనఁగ ♦ లావగు రూపము వీడి సన్నమై
పరులు జయింపరాని యతి ♦ పాపిని లంకిణిఁ జంపె నోహరీ.

ఉ. లంకిణిఁ జంపి యా వెనుక ♦ లంకను జొచ్చి కపీశముఖ్యుఁ డే
శంకయు లేక రావణుని ♦ శాలల నన్నిటిఁ గాంచి కాంచి యే
వంకను సీతఁ గానక వి ♦ వర్ణమనస్కుఁ డై నుండి యొక్క ప
ర్యంకము నందు నిద్రఁ గను ♦ క్రౌంచనుగాంచెను బేర్మి శ్రీహరీ.

ఉ. క్రౌంచను గాంచి సీతయను ♦ కందువ నెన్నుచు సీత యైనచో
సంచలతం దలంగి యిటు ♦ సాఁగిలి నిద్రిఁ గనంగ నేర్చునే
యెంచఁగ సీత గా దనుచు ♦ నేర్పడఁ జూచె నశోకకావనిన్
జంచలనేత్రి జానకిని ♦ సద్గుణపూతను నంత శ్రీహరీ. ౧౧

ఉ. చూచియనూనమోదమునఁ ♦ జొచ్చియశోకవనిన్ మహార్తితో
గోచరమైన సీతఁ గని ♦ క్రుంగి నమస్కృతిఁ జేసి యిచ్చె గో
త్రాచలమేరుశృంగసము ♦ మై విలసిల్లెడు రాము ముద్రికన్
రాచకొలంబు సామియగు ♦ రాముఁ డొసంగిన దంచు శ్రీహరీ.

ఉ. దేవ! జనించి నీ వఖిల ♦ దీనుల బాధలఁ బాప నెంచి మై
చేవ యడంచి దానవులఁ ♦ జిందఱవందఱ సేసి చంపుచున్
పావన భూమిలోఁ దిరుగు ♦ పాపుల కెల్లను నాథుఁడైన యా
రావణునిన్ వధించితివి ♦ రమ్యగుణాకర! రామ! శ్రీహరీ.

చ. దశరథనందనా! హనుమ ♦ దాసుగ నేలితి సూర్యపుత్రునిన్
వశమొనరించి లోకమున ♦ వాలిని జంపియు మీఁద వారిధిన్
గుశలత దాఁటి రావణుని ♦ గూలఁగఁ జేసి పరోపకారివై
విశదముగాఁగ సీత జెఱ ♦ విడ్చి యయోధ్యకుఁ జేర్చితౌ హరీ.

చ. పగతురు గారు రాక్షసులు ♦ పాఁడికి దేవ్యు కంద ఘోక్కటే
నిగమములోని ధర్మములు ♦ నీతులఁ దప్పి చరించువారలన్
దగదని మానిపింపఁగ న ♦ ఘం బొనరించుచు గాకటంచుఁ జె
ల్వఁగ దశశీర్షుఁ జెండియును ♦ లంక విభీషణు కీయవే హరీ.

ఉ. భూపతులందు మేటి వగు ♦ భూరిగుణుండ శాంతమూర్తి! నా
పాపము లెల్లఁ బాపుటకు ♦ భక్తిని [illegible] నిచ్చలంబునన్
దాపసబృంద సేవితప ♦ దప్రథితాబ్జవిశేష శేషశా
యీ! పరమాత్మ! కాచుటకు ♦ నెవ్వరు దక్కఁగ నాకు శ్రీహరీ.

ఉ. మీనము; కూర్మముం గిటియు • మేటి నృసింహము, వామ
నుండనన్। గా నటు జామదగ్ని యనఁ•గా రఘురాముఁ డనం
గఁ బిమ్మట౯। బూనిక రామకృష్ణులన•బుద్ధుఁడనన్ గలియం
దు ధాత్రిపై। దీనులఁ బ్రోవఁగాఁ గలికి•తీరును దాల్చెద
వీవె శ్రీహరీ. ౫౦

చ. జగములఁ దోలుబొమ్మలుగ •సల్పి నటింపఁగఁ జేయునట్టి నీ
మొగ మిఁక చూపవే జగము•ప్రమోదనటింపఁగ సూత్రధారివై
నగలఁ జెలంగి సర్వజన•వందితుఁడవై యిలమోక్షదాయివై
సొగసుల ప్రోవువై మిగుల•శోభిలు నిన్ భజియింతు శ్రీహరీ.

చ. మురళిని గేలఁబూని నగు•మోమున వన్నెలుగుల్కుచుండఁగా
బరుసున వేణువూఁదుచు ను•పశ్రుతియై ప్రణవంబెలర్పఁగాఁ
దరమె గనంగ నీమహిమ?•ధాతయు నీప్రతిముఖ్యులేనియున్
బరమదయానిధీ! మదిని•భావన సేసెదఁ గావు మోహరీ.

ఉ. భాగము నీయనట్టి యతి•పాపులఁ గౌరవులన్ వధింపఁగా
నాగమము ల్జపించి జయ•మర్జునుఁగాంచెవమందు నిల్పి స్వే
చ్ఛాగమనపరిచారములు • సల్పుచునుండెడి నిన్ భజించెదన్
భోగముభాగ్యమున్ దయను•బొందఁగఁ జేయఁగదయ్య శ్రీహరీ.

ఉ. సారము లన్ని నీవె కద • సారసలోచన! మీనరూపమున్
ధారణఁజేసి సోమకుని • దారుణలీల వధించి బ్రహ్మకున్
బారణ సేయ వేదము ల•పారకృపామతి నిచ్చినట్టి నీ
శ్రీరమణీయపాదములు • చేరి భజించెదనయ్య శ్రీహరీ. ౫౪

ఉ. కోరిక దేవదానవులు ♦ కూడిచి మందరపర్వతంబు పెన్
దారువు గాఁగ వాసుకిని ♦ త్రాఁడుగఁ గైకొని దుగ్ధవారిధిన్
ఘోరముగా మథింపనను ♦ కూలతపీఁపునఁ గొండఁ దాల్చియో
సారసనాభ! కూర్మమయి ♦ సారము వేల్పుల కీయవే హరీ.

చ. ఇల నొక చాఁపచుట్టగతి ♦ నెత్తిన యట్టి హిరణ్యలోచనున్
దలఁపడి ఘోర శూరతను ♦ దంష్ట్రిలఁ బూని వరాహరూపమై
బలిషుని వాని జంపితివి ♦ బాహుబలాఢ్యుఁడవౌచు నిద్ధరన్
మలిపితి వెప్పటట్లు సరి ♦ మట్టముగాఁ బరికించి శ్రీహరీ. ౫౬

చ. ఫలమును గోరకుండ నిజ ♦ భక్తుఁడు సర్వమునీవయంచుఁ దాఁ
దలఁచి భజించెనేని యతి ♦ ధన్యునిగా నొనరింతు వంటకున్
బలిమిని హేమకశ్యపుని ♦ బారిఁ దలంగఁగ బాలభక్తునిన్
వలచి నృసింహమూర్తివయి ♦ వాసిగఁ బ్రోచుటె సాక్షి శ్రీహరీ.

ఉ. వంచగఁ బూని మోసమునఁ ♦ బావనవామనమూర్తివై బలిన్
జంచలుఁ జేసి లోకమున ♦ శక్తికి మించినదాన మియ్యఁగా
నంచితపుణ్యశాలిని ర ♦ సాతలమందు నసంగఁ జేసితో
కొంచెమెయాపదత్రయము ♦ గొంచక మేటియటంచునో హరీ.

చ. ధరమును జామదగ్న్యవయి ♦ తండ్రిని జంపిన రాజుఁ జంప నీ
విరువదియొక్కమాఱు ధర ♦ ణీశులనెల్ల వధించి వారి నె
త్తురు పితృతర్పణక్రియకుఁ ♦ దోరపు మడ్గులుగా నొనర్చితో
పరశుధరా! నినున్ బొగడ ♦ బ్రహ్మకునైనఁ దరంబె శ్రీహరీ.

చ. తపము లొనర్చి వేల్పులును♦దానవవర్యులు నిన్ను వేడఁగాఁ
గపటచరిత్రు దుర్జనుని ♦ గావర మెక్కిన రావణాసురున్
గపులను గూడి చంప నరు♦కైవడి రాముఁడ వైతివయ్య! నీ
వపగతవృత్త కేకయనృ♦పాత్మజ హేతువుగాఁగ శ్రీహరీ!

ఉ. ద్వారకలోనఁ గృష్ణుఁ డవ♦తారమునెత్తె ననంగఁ బుట్టి పెం
పారఁగ దుష్టరాక్షసుల ♦ నందఱఁ జంపుచు నున్నయప్పు డా
క్రూరుఁడు కంసుఁడా మడిసెఁ♦ గూలిరి చేదిధరాదినాథులున్
జేరిరి పాండవాత్మజులు ♦ చేడ్పడెఁ గౌరవవర్గ మోహరీ! ౬౧

చ. త్రిపురనిశాచరాధములు ♦ తీవ్రత మానుల బాధపెట్టఁగాఁ
గపటము పూని వారి నిజ♦కాంతలనిష్ఠలఁ బాపి వేగమే
చపలలఁ జేసి దానవులఁ ♦ జంపఁ దలంచి యహింస ధర్మమౌ
ద్విపదుల కంచు ధాత్రిమును♦ధీరతఁ బల్కిన బుద్ధ! యోహరీ!

ఉ. అన్నియుగంబులందుఁ♦బరమాత్ముఁడు ధర్మమునన్ని బద్ధుఁడై
పున్నెము నిల్పఁగాఁగలికి♦మూర్తియగున్ భువి బాపసంహతిన్
గ్రిన్నన దుష్టులన్ గలియు♦గంబున ఖండనఁ జేయఁ బుట్టు నం
చెన్నఁగఁ గల్కిరూపమున ♦ నేర్పడునిన్ భజియింతు శ్రీహరీ!

చ. విదురుని భీష్మునిన్ గడుఁ బ♦విత్రులఁ జేసితివౌర! నీకృపన్
వదలుట ధర్మమా? కనుము ♦ వార్ఘవపూజిత! నమ్మినాఁడ నీ
వదనముఁ జూప వేగ మిఁక ♦ వారిజనేత్ర! ముకుంద! రాఁగదే
సదయుఁడవంచుఁ జక్రధర!♦సాయముఁ గోరితి కృష్ణ! యోహరీ!

చ. కలియుగమందు మానవులు ♦ కానరమెక్కి, చరింతురేకదా!
కొలిచెదు వెల్ల మాని వెస ♦ దుర్మదమూనిరి బుద్ధులై నినున్
గొలిచిన భావమించ గడు ♦ గుత్సితవర్తనమందు సక్తులై
తెలియరు నిన్ను సత్యమని ♦ దేవుడవంచని ధాత్రి నోహరీ!

ఉ. పుట్టిన వెల్లజచ్చుటలు ♦ బోడిమిగ గ్రిమ్మలుబుట్టుచుండుటల్
నెట్టన జీవరాసులకు ♦ నిక్కమగున్ దమకర్మపద్ధతిన్
బొట్టకునై యకార్యములు ♦ పూనికజేయుచు మంచిపెద్దలన్
బట్టు తెలుంగలేకనికి ♦ పాడియె యెవ్వనికైన శ్రీహరీ! ౬౬

ఉ. దానము చేయనెన్న ధన ♦ ధాన్యములబ్బునె యబ్బనేనియున్
గానడు మంచిపెద్దలను ♦ గాముకు గర్వము వీడలేక నీ
ధ్యానము చేయనేరడు ♦ దా! ధనమూలమె లోకమంచు స
త్యానకు దూరుడై పరము ♦ దప్పి నరుండు చరించు నోహరీ!

ఉ. మాయనుబూని పుట్టుటయు ♦ మాపులయుంగలనీదు శాంబరీ
మాయ తెలుంగలేక యిల ♦ మానవకోటి చరించుచుండు ద
త్కాయములోని జీవుడవు ♦ గావె తలంపగ నీవుసర్వమున్
జేయుదువయ్య కర్తవయి ♦ జీవులలో వసియించి శ్రీహరీ!

చ. నలువసృజింప, వెన్నుడు ఘ ♦ నంబుగ బెంప, భవుండు ద్రుంపగా
నలఘుతరోక్తి నీజగము ♦ లన్నియు జర్వితచర్వణంబులై
తెలుగక యుండు నీయఖిల ♦ తత్త్వమయుంబగు నీదు నాత్మకున్
వెలియగు జంతు వేదియును ♦ బృథ్విని లేదు తలంప శ్రీహరీ!

ఉ. నేరము లేనిదానివలె ♦ నేర్పున నల్లునిగూడి గట్టి సం
సారము సాదుగా మఱొక ♦ జారుఁడు నింటనెయుండఁగా ననా
చారము సేయుచున్ గలిని ♦ జాన లసత్యపుమాట లాడుచున్
భారము కాఁపురం బనుచు ♦ భర్తను దిట్టి కలంతు రోహరీ.

చ. పడఁతులు గొందఱీభువిని ♦ భర్తల మాటలు సెల్లనీక వం
గడమున కప్రతిష్ఠ యధి ♦ కం బని చూడక నీటుకాండ్రతో
సడిసడి సందునన్ గవయు ♦ సాగెద రికలియందు భర్తతో
బుడిబుడి దెబ్బలాటలను ♦ బూనుదురయ్యొమహాత్మ! శ్రీహరీ.

చ. సరసుని జారబుద్ధిగల ♦ చానలు మెచ్చుచు నాథుఁడెంతయున్
మురిపెముఁజూపఁ దిట్టుదురు ♦ మోసముతోడ మెలంగినేర్పుగాఁ
బరపిటుఁ దంద నుంచుఁ దన ♦ భర్తపిశాచమటంచు నెంచుచున్
దరుచుగ జారకృత్యములు ♦ తక్కుచుఁ దారుచుఁ జేతురోహరీ.

ఉ. మాటలతీరు వేఱుగను ♦ మంతనమందునఁ జింత వేఱుగాఁ
బూటకిఁదిఁడి హెచ్చగుచుఁ ♦ బొట్టకు నెంతయు మ్రింగ నెంత్రుగా
సూటిగఁ బోకయున్ సవతి ♦ సూనులఁ గాంచిన నీసడింత్రుగా
బోఁటులు పోలుచేఁ గలిని ♦ బొత్తుగఁ గాఁపుర మొల్ల రోహరీ.

చ. మెలఁకువతోడ బంధులను ♦ మెచ్చక నిందలమోపి భర్తయున్
బిలిచిన రవ్వచేసి తమ ♦ పెంకెతనంబునఁ ద్రోచి వైచి పె
న్నలసతఁ జూపి యాడ్పడుచు ♦ నవ్వలికిన్ వెడలింపుమంచులోఁ
బులుపున సంచరించెదరు ♦ పుంశ్చలు లిద్ధరలోన శ్రీహరీ.

చ. పరులను మోసపుచ్చి కలి ♦ బాంధవకోటికి హాని సేయుచున్
మురహరు నిన్ను వేఁడ కిల ♦ ముక్తికి మార్గము చూడకుందురా
విరహముచేఁ బరాంగనల ♦ వేడ్కను జూచుచుఁ గూడఁ గోరుచున్
విరసపుమాట లాడుచును ♦ బెద్దల నెన్నరు బుద్ధి నోహరీ.

చ. సిరిగలవాని మెచ్చుచును ♦ జేడ్పడి పేదజనాళి యైనచోఁ
దరిఁ గనిపెట్టి దోషముల ♦ దాఁచక వెల్లడిచేసి లంచముల్
మురియుచు లాగి పాపమున ♦ మున్గుచు నిన్ను నుదూరుచుందు రే
పరణిసి బుణ్యమెంచకయె ♦ సంతత మాఖలు లుందురో హరీ!

చ. ఎవరిమనంబునందుఁ దగ ♦ నెప్పుడు నీవు రమించుచుందువో
యెవరు తపంబుచేత సక ♦ లేశ్వరు నిన్నిల మెచ్చఁ జేతురో
యెవరు ధనాశవీడిభువి ♦ నెంతయు మోహము లేక యుందురో
యువనిని వార లొందెదరు ♦ దంచిత సద్గతి నిక్కమో హరీ!

చ. ధనము నశించిపోవఁగనె ♦ తార్గొనుదుఃఖము, సేవకాళియున్
బనులనుమానిపోవుదురు ♦ బంధులుఁ జుల్కనఁ జూతు రెంతయున్
దనయులుదారయున్ వెతలఁ ♦ దల్లడమందుదు రెంతొ కష్టమౌ
ధనమె కదా సుఖంబులకుఁ ♦ దావలమౌ జగదీశ! శ్రీహరీ!

ఉ. కాల మహత్త్వ మెట్టిదొకొ ♦ కాపురుషాళులు వృద్ధి సెంది వా
చాలత సత్యమున్ బలుకఁ ♦ జాలెడి వారలుఁ గానరారు గా
చాలఁగఁ బాపముల్ సలుపు ♦ సంఘము లేయభివృద్ధియయ్యె భూ
పాలకుఁ డాదరంబునను ♦ బాలనసేయఁడు భూమి నోహరీ!

ఉ. అండజవాహ! కావఁగను ♦ నండవు నీవు మహాత్మ! భక్తితో
మెండుగ నిన్ను వేఁడితిని ♦ మేలొనఁగూర్పుము రామచంద్ర! నీ

వుండఁగ భక్తులందఱకు ♦ నొందఁ దోకప్పుడుఁ గీడు రక్షకా !
దండముఁ బెట్టు దాసులకుఁ ♦ దప్పులుఁ గల్గవు గాదె శ్రీహరీ!

చ. నిజమును బల్కలేరు; నిను ♦ నెమ్మదిఁ గొల్వఁగ లేరు; గాని యా
యజుఁడు లిఖించినట్టి విధి ♦ యంతయు మార్పఁగ శక్యమేరికా
విజయము నొందలేక యవి ♦ వేకముచే నిలఁ గర్మబద్ధులై
కుజనులు లజ్జవీడి కడుఁ ♦ గోపముఁ జెందుచు నుందురో హరీ !

ఉ. దేవుఁడ! గీతలం జదువు ♦ దీనులఁ గాచెడి విష్ణుమూర్తి నిన్
బ్రోవఁగ వేఁడి భక్తుఁడయి ♦ పూజలు సల్పిన మానవుండిలన్
బావనగంగయందు జల ♦ పానముఁ జేసి మునుంగఁ బాపముల్
పోవఁగఁ జేరఁడా యముని ♦ పొంతకు నెప్పుడు సత్యమో హరీ!

ఉ. మాతలుగాఁ బరాంగనల ♦ మానసమందుఁ దలంప ధర్మరా
డ్ధాతలు సేరరా కొరుల ♦ దూఱుట కీడుగ నెంచ మంచి దా
దాతల వేఁడఁగా భువిని ♦ దాఁగవు సేయుము లర్థి చెంగటన్
కేతనచేతనంబ ! నిను ♦ జేరినవారికి మోక్షమో హరీ !

చ. ధనమును జూడ నాశ యది ♦ తప్పునె నానిగణింపకుండినన్
మనమున గాంతఁ గోరుటలు ♦ మానఁడు మానవుఁడీ ధరిత్రిలో
ఘనముగ నీదు పూజలను ♦ గ్రాలఁగ లేఁడిల భక్తి లేక నీ
వనిశముఁ బ్రోవకున్న ఘనుఁ ♦ డైనను మోక్షము నొందఁడో హరీ!

చ. నడచితిఁ దప్పుమార్గముల ♦ నాయువు నిండి జగంబు లోపలన్
గుడిచితిఁ బెక్కు బాములను ♦ గూడని పాపము లాచరించితిన్
ముడిచితి నయ్యయన్యధన ♦ ముల్ మదినాశనుఁ గాంచి భూమిపైఁ
గడిపితి మాయచేత గత ♦ కాలము; నీ యుఁ జూపుమో హరీ!

ఉ. తప్పదు ముప్పదెప్పుడును ♦ దాల్చిన దేహికి కాల మేఁగ నీ
మెప్పును బొంద కేనరుఁడు ♦ మీఱఁగఁజాలఁడు కాలుబాధలన్
జొప్పడి నిశ్చలంబు మదిఁ ♦ జొన్పక యోగికి భోగికైన తా
నెప్పుడు రాదుగా వరద! ♦ యీయఁగఁ బూనవె దానినో హరీ!

చ. ధనమున కాశఁ జెంది పర ♦ దారలఁ జూచిన మోహమందుచున్
మనమునఁ గోరుఁ దిండికిని ♦ మానవుఁ డెంతయు లోభమూనుచున్
ఘనమగు బాధలం బడుచుఁ ♦ గాంచగ లేఁడు త్వదీయశక్తులన్
దనువున మత్సరంబున ము ♦ దంబున నేరఁగఁ జాలఁ డో హరీ!

చ. తపమును జేయలేను మది ♦ తప్పుల వీడగలేను ధారుణిన్
జపలుఁడనైతి మాయఁబడి ♦ సజ్జనబోధన నమ్మ కెంతయున్
గపటముతో మెలంగితిని ♦ గాలుఁడు శిక్షలు సేయువేళలన్
నెపమును జెప్ప నాతరమె ♦ నీవు ననున్ గనకున్న నో హరీ!

చ. తినుటయు నిద్రఁ జెందుటయుఁ ♦ దీఱని మోహముఁ జెంది
యుంటయున్ । వినయముతో ♦ నొకప్పుడును విష్ణుని నిన్ను
భజింప కుంటయున్ । దినములు పుచ్చుచుండుటయు ♦ దేవుఁ
డపీనని యెంచకుంటయున్ । ఘనమగు ముక్తి నీఁ గలవె ♦
కాన నినున్ భజియింతు నో హరీ! ౯౪

ఉ. పుట్టిన దాదిగా నరులు ♦ పుణ్యము పాపము కర్మ చేయుచున్
బట్టుగ నాశనే నరిగిఁ ♦ బాలన చేయుచుఁ జచ్చి పుట్టుచున్
గట్టిడి దైవమంచు నిను ♦ గాఱులు కూసెద రెంత చిత్రమో
గట్టిగ నీదు మాయఁబడి ♦ కష్టము నొందుచునుందురో హరీ!

ఉ. బాలుఁడు పుట్టఁగాఁ బెరిఁగి ♦ బాల్యమునన్ వడినాటలాడుచున్
దేలఁగ యౌవనంబునను ♦ దీఱని మోహములోనఁ గాలమున్
జాలక వార్ధకంబునను ♦ నంచలతన్ బెనుచింత లొందుచున్
బేలతనంబునన్ దనువు ♦ పీడుచు నిన్నుఁ దలంపఁ డోహరీ!

ఉ. మంచికి మేలు లేదు గద ♦ మానవుఁ డీభువి సత్యమెంచకే
వంచన చేయుచుండు నిల ♦ వారిజనేత్ర నినున్ భజింపకే
కొంచకి చెడ్డకోరికలఁ ♦ గోరును గాని భవంబు దాఁటఁగాఁ
బంచమ వేద మంచనెడి ♦ భారత మెంచుక నమ్మఁడో హరీ!

చ. దాపునఁ జేరి యెంతయును ♦ ధార్మికులట్లుగ మాటలాడుచున్
మాపఁగఁ జూతురర్థమును ♦ మాయలుచేయుట మంచిదానొకో
పాపపు నీతులెన్నిటినొ ♦ పల్కుచు నుందురు మోసబుద్ధితో
చూపుము వారి కాఫలము ♦ చోద్యమె నీవటు చేయ శ్రీహరీ!

ఉ. ధనమున నాశతప్పదు గ ♦ దా! యరివర్గము మాయఁగప్పఁగాఁ
మానమున దేహపోషణకె ♦ మాత్రమె పుట్టితినంచు నెంచుచున్
బెనుపడి చీమురక్తములఁ ♦ బెంపున నెప్పుడు కుళ్ళు కొంపకై
మనమునఁ గోరునంగియయి ♦ మానినులన్ గవయంగ శ్రీహరీ!

ఉ. సజ్జన సేవకే నరుఁడు ♦ చాలఁగ మేలును బొందుఁ దత్ఫలం
బి జ్జగమందె కాంచు నిది ♦ యెంతయునిక్కము కీర్తి నొందఁగా
నొజ్జలఁ బూజ సల్పినను ♦ నుత్తమ విద్యల నభ్యసించు నీ
వొజ్జవు తల్లిదండ్రివని ♦ యోపిక నిన్ భజియింతు శ్రీహరీ!

ఉ. భుక్తియు ముక్తియుం గలుగు ♦ భూరిగుణాఢ్య నినిన్ను గొల్చినన్
శక్తికొలంది నిన్ భజన ♦ సల్పఁగ జన్మము సార్థకం బగున్

భుక్తి విరక్తియుం గలిగి ♦ బోధను జెందిన యోగికామనం
త్యక్తత నొంది నీ పరమ♦ధామమునన్ వసియించు శ్రీహరీ!

చ. జననమునొందిదుఃఖమునఁ♦జాలఁగఁగుందుచుమానవుండిలన్
గనునె సుఖంబు లేసుఖము♦గాంచెద వార్థకమందటంచులో
ననుకొను నాఁడునాఁటికిని♦ నాయువు తగ్గ సటం చెఱుంగ లేఁ
డను వట్టి రామచంద్ర!నిను♦నాఘ్యు భజింపఁగ లేఁడు శ్రీహరీ.

ఉ. లేరిల తల్లిదండ్రులును ♦ లేరిల బాంధవు లెట్టి వారికిన్
జేరవు సంపదల్ ధనము;♦ జేరవు భోగము లెల్ల వారికిన్
జేరున దోర్కటే యముని ♦ శ్రీసదనం బది తప్పు చేసినన్
సారగుణాఢ్య! నిన్భజన ♦ సల్పినచో సుఖ మబ్బు శ్రీహరీ.

ఉ. కామముక్రోధమున్ మదముఁ♦గల్గెడిలోభము మోహమేవిధిన్
సీమను లేక మత్సరము ♦ నీటుగఁ దాండవమాడు దేహికిన్
క్షేమము లేదు గాని యప♦కీర్తిని మెండుగఁ బొందు వానిచే
ధీమతు లీవిధఁ బెఱిఁగి♦తేఱి జయింతు రవెల్ల శ్రీహరీ. ౧౨౪

ఉ. ఏల ననేక జనముల ♦ నెత్తుట నెత్తిన యంతఁ గర్మలం
గూలుచు బాధలంబడుచుఁ ♦ గోరిక నిమ్మదినిల్పుఁగాని యే
కీల విధాత చెయ్వులకు♦లీనుఁడు గాక తెలంగ నేర్చమున్
గాలము వ్యర్థమై చనుట♦కా? యిదియెల్ల ననంత! శ్రీహరీ.

ఉ. లోకములోనఁ బుట్టుటయె ♦ లోపము జీవికి దుఃఖమే కదా!
పోకడ లెన్ని చూపినను ♦పుణ్యము పాపము వెంటనంటుచున్
జేకుఱు కష్టముల్ నరుని♦చిత్తము చొప్పునఁబోవు నిందిరా
నీకము పద్మనాభుఁ గన♦నేరక ముక్తిని బొందఁ డోహరీ.

చ. జయజయ సాధుపోష! జయ • శంకరపూజితపాదపంకజా!
జయజయ దేవదేవ! జయ • చారుశరీరవిభాసితా! విభూ!
జయజయ దానవారి!జయ•సంయమిమానసపద్మషట్పదా !
జయజయ వేదవేద్య! జయ • సంగరభీకర! వీర! మోహారీ.

ఉ. మంగళ మోపరేశ జయ•మంగళ మోజగదీశ సుందరా
మంగళ మోసురేశ జయ•మంగళ మోకమలామనోహరా
మంగళమోముకుంద జయ•మంగళ మోకమలాక్ష కేశవా
మంగళ మోమురారి జయ•మంగళమోగరుడధ్వజా హరీ.

గద్య—ఇది శ్రీపార్వతీ పరమేశ్వరకృపావిశేష సంలబ్ధ కవిత్వ భార
ద్వాజసగోత్ర పవిత్ర శ్రీమత్తైవిడిమఱ్ఱి వంశపయః పారావార
రాకాసుధాకర వేద వేదాంగ పదార్థ బోధనావిధాన సమర్థ
వేంకటశివరామ యార్యపౌత్రోభయ భాషాకవితావిధాన
ధౌరేయ శ్రీహర్షకవి విరచిత ద్విరూప కోశాది మహా
కావ్య వ్యాఖ్యాన ప్రావీణ్య రతిరహస్యాది సంస్కృత
కావ్యనిర్మాణ నిపుణ సదాచార నిష్ఠాగరిష్ఠ వేంకట
సుబ్బరాయశాస్త్రి తృతీయతనూజ రమోమా
సమాన పాతివ్రత్యభాసితాచ్చమాంబాగర్భ
శుక్తిముక్తాఫల విద్వజ్జనవిధేయ సహజకవితా
విరాజమాన వేంకటశివరామచంద్రమూర్తి
నామధేయప్రణీతంబైన హరి శతకము
సర్వంబును సంపూర్ణము.
మంగళం మహత్ శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ.